శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# పాండవప్రవాసము.

నాటకము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచింపఁబడినది

మూడవకూర్పు 2000 ప్రతులు.



కాకినాడ:

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1915.

 [వెల అణాలు.

# ఈనాటకమునందువచ్చు ముఖ్యపాత్రలు.



I వ యంకము.

1 ద్రోణుఁడు
2 పంచపాండవులు
3 ద్రుపదుఁడు

II వ యంకము.

1 బ్రాహ్మణదంపతులు
2 కుంతీదేవి
3 భీముఁడు
4 బకుఁడు
5 హిడింబ

III వ యంకము.

1 భటుఁడు
2 ద్రుపదుఁడు
3 పురోహితుఁడు
4 ధృష్టద్యుమ్నుఁడు
5 దుర్యోధనుఁడు
6 దుశ్శాసనుఁడు
7 కర్ణుఁడు
8 శ్రీకృష్ణుఁడు
9 బలరాముఁడు
10 ద్రౌపది
11 పంచపాండవులు
12 కుంతి

IV వ యంకము

1 విదురుఁడు
2 పంచపాండవులు
3 ధృతరాష్ట్రుఁడు
4 భీష్ముఁడు
5 ద్రోణుఁడు
6 దుర్యోధనుఁడు
7 దుశ్శాసనుఁడు
8 శకుని
9 కర్ణుఁడు
10 వికర్ణుఁడు
11 ప్రాతిగామి
12 ద్రౌపది

V వ యంకము.

1 అర్జునుఁడు
2 ఊర్వశి
3 దాసి
4 ఇంద్రుఁడు

VI వ యంకము.

1 ధౌమ్యులు
2 ద్రౌపది
3 సైంధవుఁడు
4 పంచపాండవులు
5 దాసి

VII వ యంకము.

1 గాయకుఁడు
2 సైరంధ్రి
3 ఉత్తర
4 బృహన్నల
5 ఉత్తరుఁడు
6 గోపాలకుఁడు
7 భీష్ముఁడు
8 ద్రోణుఁడు
9 కృపుఁడు
10 అశ్వత్థామ
11 కర్ణుఁడు
12 దుర్యోధనుఁడు

VIII వ యంకము

1 పంచపాండవులు
2 ఉత్తరుఁడు
3 విరటుఁడు
4 రాయబారి
5 సైరంధ్రి

# ఉపోద్ఘాతము.

—:o:—

ఈ పాండవప్రవాసమునందలి కథ, పాండవుల విద్యాభ్యాసము మొదలుకొని విరాటపర్వము తుట్టతుదవఱకును గల యంశములతో నిమిడియున్నది. పూర్వముద్రణమునందలి తప్పులు గొన్ని యిందు సవరింపఁబడినవి కాని మఱికొన్ని యిందునుం గలవు. వానినెల్లఁ జదువరులు జాగరూకులై సవరించుకొనఁ బ్రార్థితులు. ఇందుఁగల ప్రయోగరహస్యములను దెలిసికొనఁజాలక తప్పుగా దలఁతురేని వారు మా సపాశుపతపాండవాశ్వమేధముం జూచినపిమ్మటఁగాని యట్లు తలఁపకుండుటకుఁ బ్రార్థింపఁబడుచున్నారు. కథాంశములు భిన్నభిన్నములైనను గర్తలొకరే యగుటచేఁ జాలవఱకుఁ బ్రయోగములొకతీఁవిధముగా నుండునుగాన నిట్లభ్యర్థించితిమి. పరిశీలకులగు కవులకుఁ బరిశీలకులగు విమర్శకులు దొరకుట బంగారమునకుఁ దావి యబ్బుటవంటిదియని మేమెఱుఁగుదుము. కాని నేటివఱకు మాకాభాగ్యము తటస్థించినదికాదు. కాలమహిమనుబట్టి పండితకవులే కర్మమునెఱుఁగని వారలకు జంకవలసివచ్చుచున్నది, కాకుదంతాలు, అని భట్టోజీదీక్షితులుగారు సిద్ధాంతకౌముదిలోనుదాహరణమీయఁగా దానిం జూచియొకఁడు "దీక్షితులకుఁ దెలుఁగురాదు కాకిదంతాలుగాని కాకుదంతాలేమిటి" అని యాక్షేపించెనఁట? ఇప్పటి మావిమర్శకులెల్ల నిట్టివారుగానే కన్పట్టుచున్నారు. మాపుస్తకములు విమర్శింపక యొకరు మమ్ముదయఁదలఁచి వదలిపెట్టినట్లు పత్రికలో లిఖించుకొన్నారు. ఒకరననేల? వారు శ్రీకాళ్ళకూరి నారాయణపరబ్రహ్మకవిసార్వభౌములుగారు. లేకున్నచో మాగ్రంథములగతియేమగునో సంశయింపవలసినదే. ఏమందురా? ఇంతకుమున్ను బ్రహ్మశ్రీ వేరి కాశీనాథశాస్త్రులవారొకపరి మాగ్రంథము నువిమర్శించిరి. వీరుభయశాస్త్రపారంగతులు, సాహిత్యచక్రవర్తులు. వారివిమర్శనము తుదకేమైనదో వారేనుడువఁగలరు. పిమ్మటఁ బిఠాపురము దర్బారుకవులు వెంకటరామకృష్ణులు విమర్శించిరి. వారివిమర్శనమేమైనదో మాసపాశుపతపాండవాశ్వమేధమే. తెలుపఁగలదు ఇటీవలమఱియొకరెవరో విమర్శించిరి. వేరెందుకుచ్చరింపవలెను. ఆపేరును నావిమర్శనమేమైనదియుఁ మాతృణీకరమువలనఁ దెలిసికొనఁదగు. ఓదుష్కాలమా! ఇకనైనఁ దిరుపతివేంకటేశ్వరుల గ్రంథములను మంచి విమర్శకులపాలుచేయఁ దలఁచుకోలేదా! వారినేల వృథాయాసము పాలుగావించెదవు. వారిగ్రంథముల నేల పెంచెదవు. "నాదయయున్నచో వర్ణమాత్రానభిజ్ఞాతయగు చాఁకలిపుల్లిగాఁడుగూడ కవిసార్వభౌముఁడగు. తిక్కన భారతమంతయు విమర్శించి తప్పులనగలఁ

డు. కావున నొక నమస్కారముఁ గావింపవలసినదే'' యనుచున్నావా! కానిమ్ము. అట్లేని నీకొకనమస్కారముఁ గావించుచున్నాము. అనర్గళకవితాప్రవాహమునం దెచ్చటేని యతి మండూకప్లుతి గావించుట మహాకవులకు సహజప్రమాదమని శ్రీనాథాదికవుల గ్రంథములు పరిశీలించినవారికిఁ దెలియకమానదు. అవియుఁ గవులయజ్ఞానవిలసితములనియు 'నేనుమాత్రమూరకున్నానా దేనికో మున్నువ్రాయుచునేయున్నా'నను సామెతగా మేమును దప్పులు పట్టఁగలిగితిమనియు ననుకొనువారికి మావందనములే ప్రత్యుత్తరములు. అట్టివారికియతియుఁ బ్రాసయుఁ దెలియదనుట యజ్ఞానమో దివ్యజ్ఞానమో పండితులే గ్రహింతురుగాత. ఇందుఁ గలిగిన లేఖకాది ప్రమాదములు సవరించుకొను భారము దయార్ద్రహృదయులగు మాచదువరులకే వదలుచున్నాము.

అయ్యలారా!

ఈ పాండవ ప్రవాసమునకు ట్రెయినింగు స్కూల్సు లోయరుక్లాసులకు పఠనీయ గ్రంథముగా నిర్ణయింపఁబడినదగుటచేఁ దృతీయవారముద్రాపణభాగ్యము తటస్థించినది. ద్వితీయముద్రణమునందలి లేఖకాదిప్రమాదము లిందునఁ గొన్ని సవరింపఁబడినను బ్రస్తుతమునందు మఱికొన్ని ప్రమాదములుండకమానవు గాన వానిని సహృదయులు మన్నింతురుగాత.

ఇట్లు

శతావధానులు

తిరుపతి వేంకటేశ్వరులు.



శ్రీమత్పరదేవతాయైనమః

# పాండవ ప్రవాసము.

## తిరుపతివేంకటీయము.

నాటకము. 



### ప్రథమాంకము.

( నాంది )

చ. జయ మెవరిచ్చు నెయ్యదియశంబిడు నేదిసుఖంబొసంగు స
న్నయ మభివృద్ధి చెందుటకునై మతి యొద్దినిగాన మేది దా
నయ మనుగూర్చుఁ బాఠకుల కట్టిన శ్రోతలకున్, బ్రశస్త ము
న్నయ మలభారతంబొసఁగుఁ బంచమవేదము మీ కభీష్టముల్.

[ నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును ]

సూత్ర—బావా ? ఇటురమ్మా.

మారి—ఇదె వచ్చితిని.

సూత్ర—మొన్నటి వ్యాసపూర్ణిమనాఁడు మన మొనరించిన పూజాపురస్కారములకు నలరి భారతగురువుగారు మనకిడిన యాశీర్వచనమును నీవును వింటివిగా ?

మారి—వినకేమి ? "పాండుపుత్రులంబోలె మీరును దుర్జయులై నెగడుదురుగాక" యని ప్రీతిపూర్వకముగ నాశీర్వదించిరి.

సూత్ర—తిరుపతి వేంకటేశ్వరులచే రచింపఁబడిన పాండవప్రవాసముం బ్రదర్శింప నెంచిన మన కేనాఁడు వారి యాశీర్బలమున నెందును గొదువ రానేరదు. కావునఁ బాత్రముల నాయత్తపఱుపుము.

మారి—చిత్తము ( నిష్క్రమించును )

సూత్ర—పుణ్యమూర్తులగు నోసభాస్తారులారా !

క. ద్రోణాచార్యుల కనయగు, జాణన్ మద్గురువరేణ్యు స్మరియించి కడు
నాణెముగ నతనిశిష్యుల, పోణిమి మీకిపుడు దృశ్యముగ నొనరింతున్.

( నిష్క్రమించును ) ( ప్రస్తావన )

[ అంతట ద్రోణుఁడును పాండవులును ప్రవేశింతురు ]

ధర్మ—చిత్రము తరువాతి సంగతి సెలవిండు.

ద్రోణు—అట్లేని ద్రుపదుఁడును నగ్నివేశ్యునొద్ద సహాధ్యాయులమై చదువుచు నీరక్షీరంబులం బోలె మెలంగుచుండ నొక్కనాఁడు ద్రుపదుండు నన్నుం జూచి,

గీ. "ఏను పాంచాలదేశము నేలునప్పు, డయ్యెడకు నేగుదెంచి మాకడ యుండి
నన్ను నన్బోలె రాజ్యంపు మన్ననలను, నొంది నాకుఁ గృతార్థత నొసఁగవలయు."

అని ప్రార్థించెను.

భీము—అది యుచితమే కదా ?

గీ. పుడమినేలుపులే కడుఁ బూజ్యతములు, గానిలోఁ బరికింప మహానుభావు
లగుచు నట్లుండ సహజాత అధికమిత్రు, లట్టి మిమ్ముఁ బూజించుటకన్నఁ గలదె?

తరువాతి సంగతి సెలవిండు.

ద్రోణు—పదంపడి కొంతకాలమునకు నేను విద్యాసమాప్తిం బొనరించి వివాహంబు చేసికొని పుత్రోదయుండనై ధనార్జనంబునకై పరశురాము నికటమ్మున కరుగుట యయ్యనఘుండు.

క. "ధనమెల్లఁ బంచియిచ్చితి, ననఘులగు యాచకులకు నవనీతల మె
ల్లను గశ్యపునకొసంగితి, నను నేటికిఁ జూడ వచ్చినాఁడవు తపుడా ?

కానిమ్ము మించినదానికేమి ? "నా శరీరంబును నస్త్రమ్ములును నిప్పటికి మిగిలి యున్నయవి. ఇందు నీ కెయ్యది వలయు నదియ పరిగ్రహింపు" మనవుఁడు సంతసించి శస్త్రాస్త్రమ్ము లయ్యనఘునివలనఁ బరిగ్రహించి బాల్యమిత్రుండగు ద్రుపదుని పాలికిం బోయితి ;

అర్జు—(తనలో) ఓహో ! ఇయ్యనఘుఁ డొక్కనాటనే విద్యనభ్యసింపలేదు. తాతం బోలె భార్గవునకుఁ గూడ శుశ్రూష చేసి కొన్నివిశేషములు గ్రహించి యున్నాఁడు. (ప్రకాశము) చిత్రము. తరువాత ద్రుపదుండు కండకావరమున మిమ్ము నెఱుఁగక నిష్ఠురాలాపితం బగు ధనమత్తతం గనఁబడెను గాఁ బోలును.

ద్రోణా—అంతమాత్రముతోఁ జాలించిన నా కింత పట్టుదలయే లేకుండును.

నకు—గురువర్యా! ఇఁక నేమిచేసెను?

ద్రోణా—నన్ను జూచి యొకసక్కెముగా,

గీ. "ఏను మూర్ధాభిషిక్తుండ నీవు పేద బాఁపనయ్యవు మనకెట్లు పొసఁగు మైత్రి?
పరిసరే! పొమ్మ పొమ్మ యాచకుల లక్కు, గాంబు, గనఁ జేసితివి నీగుణంబు దెలిసె"

అని నన్నవమానించెను.

సహా—(కోపముతో)

ఉ. ఇరువుర మేము నన్న లోక యిర్వురు నల్వుర మేకమై సురా
సురు లని నడ్డమైన నలగూని సహాయుఁడు గాఁగ నిల్చినన్
గుణమున నేఁడె ద్రుపదు దోర్బలమున్ హరియించి తెచ్చి యో
గురువర! మీకు దక్షిణగఁ గొంకక యిచ్చెద మింతయేటికిన్.

ధర్మ—గురువర్యా! ఇంతమనుచున్న ధార్తరాష్ట్రులు యుద్ధసన్నద్ధులై యరిగిరిగదా వా
రల కతండు సాధ్యుండు గాకయుండునా!

ద్రోణా—ధర్మనందనా!

ఉ. ద్రుపదుఁ డయోనిసంభవుఁడు దోర్బలమునను నాకు జోడు గాఁ
డపరిమితాస్త్రశస్త్రనిచయమ్ములఁ బెద్దయు నాతనికేతన
ట్టె పరమశూరుఁ డాతని కడింది మగంటిమి కెవ్వరడ్డు? భూ
మిప? మనయర్జునుం డతని మించఁ దనయ్యెఁ బ్రాతఁ గోపఁడే?

అర్జు—(సంతోషముతో) దేశికేంద్రా!

ఉ. కౌరవపక్షులన్ నవఁ గాఁ బవనాత్మజుఁ డగ్రిమంపు నె
క్కొని నభమ్మునన్ రిపులఁ గూల్చఁగ నేను రథమ్మునెక్కి యా
హవమునఁ బార్షతుం గదిసి ప్రాణముతోడన పట్టితెచ్చి మీ
కవమతిఁ జేసినట్టి ఫలమందఁగ దక్షిణగా నొసంగెదన్.

ధర్మ—అర్జునా!

మ. ఘనమున్ రాజ్యము నెందుకిచ్చెఁ? దవకున దైవంబు, పూజ్యుల్ తపో
ధనులు న్మాన్యులు నైన యాచకులకున్ దారిద్ర్యబాధానిగం
జను లౌ పంగులు నంధులౌ జనులకున్ సంగత్వణ శ్రేయునం
మన కాదే? యొకపొట్ట కేమిటికి నిచ్చు న్మేటిసామ్రాజ్యమున్.

కావున నతం డవశ్యమును పండ్రాం డగుట నట్లొనరింపుము గాక.

భీము—అన్నా! తక్కినవారిమా టెట్టులైనను,

క. పితనాఁటనుండియును నొక్క నిమేషము పాయ కొక్క కాయంబై యుం
డిన మిత్రుఁ బాఱ్ఱి నిటుచే, సిన దుర్మార్గునికి నింక సిరి యెటు నిలుచున్.

నకు—గురువరా! నాకుఁ దెలియమి నడుగుచున్నాఁడను. క్షమించి యీసందియముం
దీర్పుము.

మ. బకముం బోలె స్వకుక్షిరక్షణకునై ప్రాజ్యంబు రాజ్యంబుపూ
ను కఠోరాత్మకునిన్ కృతఘ్ను జడునిన్ దుశ్శీలు దుశ్శ్రీకుఁ జం
పక "ప్రాణంబులతోడఁ ద" మ్మనుమఁ బంపం బాడియే? వీఁడు భూ
మికి భారం బగుఁగాదె? యెందుకో యకో మీరిట్లు భాషించుటల్.

ద్రోణు—నాయనా! ఇతఁ డిప్పు డెట్టివాఁడైనను గ్రమముగాఁ గష్టసుఖము లొంటఁ
బట్టి పిదప లోకోపకారి కావచ్చును. కావున మన మితనిం జంపఁదగదు. "లేని
దాతకన్న నున్న లోభి మేలుఁ" గని కదా? పెద్దలు చెప్పుదురు.

అర్జు—గురువరా! ఇఁక నాలస్య మెందులకు? పోవుదము పదుండు. (అందఱును బ
రిక్రమింతురు.)

భీము—(దృష్టినిగిడ్చి) అదిగో కాంపిల్యనగరము. కౌరవసైన్యమెల్ల ద్రుపదుని ధాటికి
నోడి యెట్లు వెనుకకు వచ్చుచున్నదో!

అర్జు—(ద్రోణధర్మజులకు నమస్కరించి) మీరు సమీపమ్మున నె యుండి చూచుచుం
డుఁడు. మేము నల్వురమును జని,

క. మత్తాత్ముఁడైన ద్రుపదుని, నెత్తెఱఁగున నేనిఁ బట్టి యిప్పుడ యిటకున్
దెత్తుము తెచ్చినపై మీ, చిత్తం బెటువచ్చు నట్లు సేయఁగవచ్చున్.

(నలువురు నిష్క్రమింతురు.)

ధర్మ—మహాత్మా! ద్రుపదుం డయోనిజుం డని తాము నుడివితిరిగదా, యెట్టిది యది?

ద్రోణు—మున్నితనితండ్రియగు పృషతుండు తపంబొనర్చుచుతఱి నొక్కనాఁ డన్నికట
మ్మున మేనక యను నచ్చర కుసుమాపచయంబు సలుపుచున్న నద్దానిం గాంచి
పరవశుం డగుటయు, నతనికి ధైర్యంబు నిలువదయ్యె. అమోఘవీర్యుం డగుటనతని
తేజం బిట్లు పరిణమించె.

ధర్మ—(దృష్టినిగిడ్చి) అదిగో! సమర మెట్లు ప్రవర్తిల్లుచున్నదో చిత్తగింపుఁడు.

ద్రోణు—(చూచి) వత్సా! నేను ద్రుపదునిం గూర్చి యేమిచెప్పితిని?

చ. అతఁ డెటువంటివారలను నాహవమందున లెక్క సేయఁ డ
ప్రతిహతవిక్రముండు మనపార్థుఁడు న్నిగిడించుచున్న యా

శితశరవర్షమే యతనిచేత వచించెదు నైననేమి ని
ర్జితు నొనరించి తెచ్చు మనకీ్రిడి యకుంఠిత విక్రమున్మనన్.

(తెరలోc బెద్దకలకలము.)

ధర్మ—(విని) గురువరా! ఏమి యీ హాహారవ మింత విపరీతముగా వినవచ్చుచున్నది?

ద్రోణు—హాహారవమున కేమున్నది? దు్రపదుని యరదముపైకి సింగంబువలె లంఘించి మనయర్జునుం డతని నొడిసి పట్టి తనయరదమునకుc గట్టుచున్నాcడు.

ధర్మ—(చూచి) అతిశీఘ్రగమనమ్మున నిచ్చటికే తీసికొనివచ్చుచున్నాcడు.

[అంత ద్రుపదసహితముగా నర్జునుcడు ప్రవేశించును.]

అర్జు—(నమస్కరించి) గురువరా! ఇదిగో దక్షిణ, పరిగ్రహించి యాశీర్వదింపుcడు.

ద్రోణు—(ద్రుపదుంజూచి ఎకసక్కెముగా)

ఆ. వె. పేదపాఱుc డెవcడో పెద్దరాజెవ్వడో, యిప్పుడైన నీకు నెఱుకపడెనె?
రాజ్యమేలు టుడిగి రాcజన్నె? రిక్తుల, మైనమిమ్ముc జూడ నోనరేంద్ర.

ద్రుప—(తలవంచుకొని యూరకుండును)

ద్రోణు—అర్జునా! ఇతని కీబంధనములు విప్పుము.

అర్జు—చిత్తము. (అట్లొనరించును)

ద్రోణు—ఓయి! పాంచాలభూపాల!

కం. నినుc జంటిపిల్లనికి గో, వు నొసంగెద నంచుc జూడcబూనితి నీదౌ
ధనగర్వము నా కిమ్మ్యెడ, నొనరించె నఖండ మైనయోగము కంటే.

సమస్తధర్మవేదియు నఖండ ప్రజ్ఞాధురంధరుండును రాజకులైకభూషణుండును నగు భీష్ముండున్నవాc డని యెఱిగియు నిన్నుం జూడ నచ్చుట నాతప్పిదమే కాని నీతప్పిద మిందు లేశమును లేదు. ఇcక నీయిచ్చం జనుము.

ద్రుప—(తనలో) అన్నా! బ్రాహ్మణప్రభావ మెంతదుర్జయ మైనది. వీరల కీర్తిశక్తి తపంబువలనం గదా! కలిగె. నేనును నట్టితపం బొనరించి యెట్టులేని నితని జయించి యీయవమానముం బాపుకొందుcగాక. (నిష్క్రమించును.)

ధర్మ—గురువరా!

తే. గీ. కష్టపడి కట్టి తెప్పించి కడకునింత, వైళమే యీతనిని విడువంగవలెనె
వృద్ధరాజులకేనిc జూపింపవలదె?, యింతమెత్తని హృదయమే లెందుc జూడ.

ద్రోణు—తండ్రీ ధర్మనందన!

కం. అవనీసురులకుఁ గోపము, దవులంగాఁ జనదొకంటఁ దవిలిన నోకజా
మఃధిగఁ బోనలె నటుగా, క వివేకపుఁగోప మొందు నతఁ డంత్యజుఁడౌ.

అర్జు—అరుగో, అన్నయును, గఃలును మన సైన్యములును నిటువచ్చుచున్నవి.
ఇఁక మనము గూడ వారిఁ గలసికొని పురమ్మున కరుగుదము. (నిష్క్రమింతురు)

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బగు పాండవప్రవాసమ్మునఁ
బ్రథమాంకము.



# పాండవప్రవాసము.

## ద్వితీయాంకము.



[అంత నిర్వ్యయబ్రాహ్మణదంపతులు ప్రవేశింతురు]

భార్య—నాథా! నేనుండఁగా మీ రా యసురుని కాహారం బగుట న్యాయము కాదు. అందులకై నే నరిగెద. నామనవి విని నన్ననుగ్రహింపుఁడు.

భర్త—(విచారముతో)

తే. గీ. అగ్నిసాక్షిగఁ బెండిలి యైనయట్టి, పరమసాధ్విని సంతానవతిని నిన్ను
నసురకాహారముగఁ బంపి యసువుల నరక, మనుభవించుటకన్న నియ్యదియ మేలు.

భార్య—నాథా! మీ రట్లు సంశయింపవలదు. భార్య సంతానార్థముగా నేర్పడినది. అట్టిఫలము నావలన నిదివఱకే కలిగినది. నన్ను వానికై యర్పించి కొమరునిం గొమార్తెను రక్షించుకొనుఁడు.

భర్త—అకటా! నే నీపలుకులు వినఁజాలను. ఓహో! దైవమా!

గీ. నరుల భక్షించునట్టి దుర్ణయుహిడింబు, సమయఁగాఁజేసెనఁట కదా శౌర్యధుర్యుఁ
డెవ్వఁడో యొక్కరుఁడు లోకైకవీరుఁ, డతని నివ్వానిఁ జంప నీవనుపరాదె?

భార్య—ఆహా! ఆమహానుభావునిఁ గన్నతల్లి యెంతపుణ్యాత్మురాలో కదా! ఎల్లకాలము నామె కడుపు చల్లనై వర్ధిల్లుఁగాక.

[బ్రాహ్మణస్త్రీవేషముతోఁ గుంతి ప్రవేశించును]

కుంతి—అమ్మా! మీ రెందులకో యిట్లు విచారించుచున్నారు. వినఁగా వినఁగా మీయాపద తెఱంగు నాకు స్పష్టపడినది. మీదంపతులుఁగాని మీకొమరుఁడుగాని కొమరితగాని యామ్రిక్కడిరక్కసుని కాహారముగఁ బోనక్కరలేదు. నాయైదుగురుకొమరులలో నొక్కరునిం బంపెద. మీరు స్వస్థతం జెందుఁడు.

భర్త—అక్కటా! ఎంతమాట వినవలసివచ్చినది.

గీ. అన్నవస్త్రమ్ములకు లేక యానదేఁగుచు, నతిథులై మద్గృహమ్మున నడఁగియున్న
మీకు నపకృతిఁ గల్పించి మేను నెంచి, బ్రతుకుదునె యప్రతిష్ఠకు భాజనముగ.

కుంతి—మాకది యపకారంబుకాదు. ఉపకారమే, ఏమంటిరా? నాకొమారుం డారక్కసునిం జంపి యిహమందుఁ బ్రతిష్ఠయుఁ బరమందుఁ బుణ్యమును నార్జించువాఁడే కాని వానిచే జిక్కువాఁడు కాఁడు.

భార్య— అమ్మా! నీ విట్లనెదవేమి? ఈ బకాసురుఁడు సామాన్యుఁ డనుకొంటివా? వీని గొప్పరాజు లెవ్వరును జయింపలేకయే కదా ప్రతిదినము నొక్క మానిసిని రెండెనుబోతులను, ఒక బండెడన్నమును నియతముగా నిచ్చుట కేర్పఱచుకొనిరి. వీనిం జంప నొరులకు వశముగాదు. ఎప్పుడో ఆఘటోత్కచజనకునివంటి మహానుభావుఁడు పుణ్యము కట్టికొనవలెను.

కుంతి— అట్టివాఁడే నాకొమరుఁడును ననుకొనుఁడు, మీ కది యంతయు నెందులకు? మీ రూరకొనుఁడు. నే నీపని నెఱవేర్పించెదను.

భార్య— అమ్మా! నీకు నిజముగ నాపద రానీయదను నమ్మకమున్నచో నట్లొనరింపుము లేనిచో మాకొఱకు నీవు పుత్రశోక మనుభవింపకుము.

కుంతి— నా కట్టియిక్కట్టు లేశము లేదు. లోసికిం జని యొడ లెఱుఁగక దుఃఖించు మీసంతానము నోదార్పుఁడు లెండు. అదె నాకొమరుఁడు భిక్షాశనంబు గొని వచ్చుచున్నాఁడు నే నతనితోఁ జెప్పి వానిం జంపించెద.

(ఇరువురును నిష్క్రమింతురు)

[అంత భీముఁడు చంకజోలితోఁ బ్రవేశించును]

భీము— (జోలిసంకఁజూచుకొని తనలో)

. ఆఁకట నాకుం గడు పెం,తో కట నకనకలఁబడెడు నొకకబళంబే
నీ కొను బికిరపుం గూ, డీ కాసంతయును, నెట్టు లీడిన మేగున్!

ఏమో? యీదిన మెక్కడికేగినను లేదనువారే కాని మాధుకరము వైచువారే అరుదు. లాక్షాగృహంబు వెలువడి వచ్చినయది మొదలు నాకుఁ గడుపునిండ నన్నమే లేదు. అక్కడికిని దల్లి మే మేగురమును దెచ్చినయన్నమును నేకరాశిఁ జేసి యందు సగపాలు నాకుఁ బ్రత్యేకము గుడువఁ బెట్టుచుండును. ఛీ! ఈ దరిద్రపువృత్తి కన్న నధమవృత్తి వేఱొండు లేదు. (కోపముతోఁ బ్రకాశము) ఓరా! యంధరాజా! కేవలాంధుఁడవే కాక దుర్గుణాంధుండవు గూడ నైతివిగా!

ఉ. కూళతనమ్మునం గొడుకు గోరెడికోర్కెకు సమ్మతించి భూ
పాలుని ధర్మనందను నుపాయమునైఁ బురి వెళ్ళఁగొట్టియుం
జాలక లక్కయింట నిడి చంపఁగ నగ్గి దగిల్చితే? కటా!
జాలి యొకింత లేద? నరజన్మము నెత్తవె? గొడ్డువాఁడవే.

కుంతి— (సమీపించి తనలో) ఏమో యీవేళ నితఁడు కడుఁగోపముగ నున్నవాఁడు. ఓహో! ఇదియా హేతువు? ఈనాఁడు జోలి బొత్తుగా నిండలేదు. అక్క

టా! దైవమా! రాజాధిరాజగు పాండునృపాలునిపుత్రుల కిట్టియవస్థ కల్పించి తివి? (ప్రకాశము) తండ్రీ! ఎందుకోయి, ఆవృద్ధరాజు నట్లు నిందించుచుంటివి? ఇది యంతయు నాజన్మక్రూరుఁడగు నాదుర్యోధనుని దుర్మంత్రమే కాని మఱి యొకటి కాదు. నీయన్నను యువరాజుఁగాఁ జేయుటకు సహింపక, కొడుకు సారెసారెకుఁ దనయొద్ద కరుదెంచి విచారింపఁగాఁ దనయాశక్తిని జెప్పి చూచి తుదకు మనకు వారణావతము నివాసముగా నేర్పఱచెను. ఆపై జరిగినలాక్షాగృహదాహప్రయత్న మతఁడు లేశమును నెఱుఁగఁడు. ఇది యంతయు సుయోధనునిపన్నుగడ. ఇంతకు విదురుఁడనియొకమహాత్ముం డుండుటంబట్టిగాని మన మాపురంజనుని మాయలోఁ బడి మ్రగ్గినవారమే. పోనిమ్ము తండ్రీ! ఇఁక వారలం దలఁపకుము. మనకు మంచిదినములు రానున్నవని వ్యాసులవారు చెప్పుట వింటివి కదా?

భీము—అమ్మా! నాఁడు నేనొక్కపని చేయవలసినది సుమీ!

మ. కలియన్ గట్టి సుయోధనాదిశతముం గాలాంతకుండో యనం
బలిమి న్నెత్తిని బెట్టి తెచ్చి జతుసద్మంబందు మున్నగ్ని సం
ధిలఁగాఁ జేసి యొకొక్కనిన్ గ్రమముగా దీపించు నావహ్నికిం
బలిగా నిచ్చినచో ననున్ జగము సేబా సంచు శ్లాఘింపదే.

కుంతి—తండ్రీ! శాంతింపుము. ఎన్నటికేని యాసుయోధనునికి మంచిబుద్ధి కలుగకపోవునా? కలిగినచో మీరును మీరు నేకముగా నుండకపోదురా?

భీము—తల్లీ! ఎంత వెఱ్ఱిదానవు?

ఉ. పుట్టినబుద్ధి వాని కిఁకఁ బుల్లలతోడనె కాని పోదు నీ
వెట్టి యమాయకత్వ మొకొ? యించుకయేని యెఱుంగ వక్కటా!
పెట్టఁగఁజేయఁడే విషము, పెద్దనదిం బడఁద్రోయఁ జేయఁడే
బెట్టిదుఁడై విషాహులను బెట్టి ననుం గఱపింపఁ జేయఁడే.

కుంతి—తండ్రీ! పెద్దవారెప్పుడును జెడ్డవారు గాలేరు. సారెసారెకు నదియే తలపోయకుము. ఈమాట వినుము. మనవలన మనయింటి గృహస్థుని కొకయుపకారము కావలసియున్నదఁటోయి.

భీము—(ఆదరముతో) అది యెట్టిదియైనను దప్పక చేయవలసినదే.

కం. మనకుఁ దమయిల్లు వాస, మ్మున కిడి బంధుగులకన్న మోమోటమునం
జన నొసఁగినట్టి యిప్పా, వననిబుణము దీర్చుకంటె భాగ్యముకలదే.

అదియేదో చెప్పుము.

కుంతి—నీవు కడు నాఁకొని యున్నవాఁడవు లోనికిరమ్ము. భోజన మైనపిమ్మటఁ దెల్పెదను.

భీమ—తల్లీ! యేమట్లంటివి? బ్రాహ్మణకార్యముకన్న నాకు భోజన మెక్కుడా? (స్మృతినభినయించి) ఈపట్టణములోని జనులనందఱిని బకాసురుం డను నొక్క మ్రుక్కడిరక్కసుండు బాధించుచున్నవాఁడని వింటిని. వానిబాధ వీరి కేమైనఁ దటస్థింప లేదు కద! అట్లే యైనచో (కోపముతో)

మ. ఇపుడే పోయి మదాంధు నచ్చెనటి నాహీనుం గురాచారు న
చ్చపలుం గ్రూరు నరాశిఁ బట్టి త్రుటిలో సంగ్రామరంగంబున
న్నిపులం గూల్చి "మహానుభావుఁ డెవఁ డీవిప్రార్భకుం" డంచు నా
యుపకారమ్మును బౌరు లెన్నుకొనఁగా నుత్సాహినై వచ్చెదన్.

కుంతి—తండ్రీ! వానినే నీవు వధింప వలసినది. వానినిమిత్తము పిండివంటలు మొదలైనవి లోన వండుచున్నారు. తృప్తిగా నవి భుజియించి మఱియుం బొమ్ము.

భీమ—అట్లనే యొనర్చెదను (కోపముతో) ఓరీ! ఏకచక్రపురనరోదర క్రూరబకబక!

ఉ. దేవుఁ డొసంగునంగములఁ దెల్విమెయిం బని చేసి చక్కఁగా
జీవనమున్ బొనర్పక కుచేష్టుఁడవై మదమెక్కి యూరకే
జీవుల బాధపెట్టెదవె? ఛీ! చెడుసోమరిపోఁత? నీ కదే
చావు తటస్థ మయ్యె నిఁక సాగవు నాయెడ నీప్రతాపముల్.

(అని తల్లితో నిష్క్రమించును) (బకుఁడు ప్రవేశించును)

బకుఁడు—(పరికించి) ఓహో! ఏమి యీనాఁ డింతప్రొద్దయినను నాకాహారము వచ్చినదికాదు? (కోపముతో) ఔరా? పౌరుల కింత యేమఱుపాటా? సరే వీరల నెల్ల నొక్కదినమే భక్షింతుఁ గాక!

తే. గీ. ఒక్కమానిసియును దున్న లొక్కరెండు, బండెడన్నము నాకొక్క పంటికింది
కైన వచ్చునె? పోనిమ్మటంచునొప్పు, కొన్న నదిగూడఁ గ్రమముగానున్నయయ్యొ.

ఓరీ! ఏకచక్రపురవాసులారా!

శా. చేతన్నాకరయో యిఁతస్వల్పమున గాసించె న్బకం డంచు మీ
చేతమ్ముల్ దలపోయఁ బోలు నవురా? జీమూతసంఘాత ని
ర్ఘాతవ్రాతకఠోరు నన్నెఱుఁగరే? కాలంబు దాపయ్యెనే?
గోతం గూలితి రేదురాత్ముఁ డిటు మీకు న్జేసె దుర్బోధముల్!

ఔరా? విరుద్ధము, ఏమీ సాగదు? భ్రుకుటివిక్షేపమాత్రవిత్రస్తీకృతత్రియంబకుం డగు బకుండే మీ యీ మతికి భాజనమయ్యెఁగా! (యోజించి) ఈతప్పు నాకరుణది కాని మీదికాదు.

ఉ. ఏడుమమన్నవార లిటు లేకముఖంబుగ వచ్చియుందు మో
మోడి యనుగ్రహించుటకియుం దొసఁగయ్యెనె? నేను నాఁకట
న్వ్రాఁడుచునుండ మీరలు సమగ్రముగా భుజియించివచ్చి న
న్నూడఁగ వేడుకయ్యెనె? నృసూదనుఁ డీబకుఁ డం చెఱుఁగరే.

ఇంతకు మీరేమిచేసెదరు! కలియుగం బాసన్నమవుటచే మీకిట్టి దుర్బుద్ధులు పుట్టుచున్నవి. కానిచ్చో,

ఉ. ఎప్పటినుండి నాకు బలి యిట్లిడుచుండిరి నేఁడె పుట్టెనే?
తప్పునె యింతమాత్రమున, దానవజాతి యటన్న నింతగా
నెప్పుడు నెల్లిదం బగుట నిప్పటి కేవినలేదు నేఁటికి
న్మాశ్వాదఁగూడి క్రొత్తలగు మున్నరికంబులు మీకుఁ జొప్పడెన్.

(చెవియొగ్గి) ఏదో ధ్వని వినవచ్చుచున్నది (చూచి) బండియొకటి బొడకట్టుచున్నది. (కొంచెము నడచి) అవును నానిమిత్తమై వచ్చెడి యన్నపుబండియే, కానిమ్ము నేఁ డింతటితో శాంతింపను. ఈయాలస్యమునకుం దగిన ప్రాయశ్చిత్తము చేసితీరెదను. (దృష్టినిగిడ్చి) ఏమిరా! బండి నక్కడనే నిల్పి యూరకున్నావు? ఈయాలస్యమునకుఁ గారణము నీవా? పురజనులా? (తనలో) వీఁడెవఁడో పెల్లము గొట్టి నరాయినతొ నెంగులకును సమాధానము చెప్పఁడు (కొండొక నడచి చూచి) కడుఁ గొగరుఁబోతుగాఁ దోఁచుచున్నాఁడు! బండిలోఁ గూర్చుండి యందుఁ గల భక్ష్యములన్నియుఁ దినుచున్నాఁడు. ఏమో కాని యీదినమంతయు మార్పుగానే కన్పట్టుచున్నది. (ప్రకాశము) ఓరీ! తిండిపోతా! నన్నెఱుఁగుదువురా? నాకై తెచ్చిన పదార్థము లుచ్ఛిష్టములు చేయుచుంటివా? ఇదిగోఁ జచ్చితివి.

(తెరలో)

ఈపదార్థములు నేను దినుటవలన నీకొకనష్టములేదు. ఏమంటివా? నేనుఁగూడ నీకాహారమగువాఁడనే కదా?

బకు — (తనలో) ఓహో! వీఁడెవఁడో పురజనుల ప్రేరణచే నాతోఁ బోరవచ్చినవాఁడు గాని నా కాహారార్థమై వచ్చినవాఁడు కాఁడు. అట్టివాఁడే కానున్న నీధైర్యమె

క్కడిది? ఏమీ? ఈకంఠధ్వని! కడు గంభీరముగా నున్నదే? కానీ వీనిం జంపలేకపోదునా? (ప్రకాశము) ఓరీ! కపటాత్మా! నీచందంబు నేను గుర్తించితిని. నీవు నన్ను జయింపవచ్చితివిగా? అట్లయిన బండిదిగి యిటురమ్ము.

క. జీవమ్మును యమపురికిం, బోవెడలం గొట్టి దేహమును రక్తముతోఁ
బ్రేవులతో నిమిషములో, నావంతయు మిగులకుండ నాహరింతున్.

భీము—(ప్రవేశించి)

తే. గీ. కొంగవలె దొంగతిండిని గోరనేల? తులువ? జీవింపరాదె? యేవలననైన
బుద్ధిగలిగెద వేనియుఁ బొమ్ము విడుతుఁ, గానిచో నేఁడు బంపింతుఁ గాలుపురికి.

బకు—ఓరీ! వదరుఁబోతా! "గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిన" దన్నట్లు నాకు నీవు ధర్మపన్నములు గూడఁ జెప్పఁబూనితివిగా? అవుసు చెప్పవేమి?

ఉ. చూచినతోడనే కదిసి సున్నముగా నలుగంగఁగొట్టి లో
వైచుట మానినందు కిటువచ్చుచునున్నవి చిక్కపల్కు లో
రీ! చిరకాలభుక్తమగు నీబలి మాన్పఁగ నీవకాదు కా
నీ చతురాననప్రముఖులేనియుఁ జాలుదురా? దురాత్మకా.

దీనికేమిగాని నిన్నుం జూచిన నాకుఁ బరమానందం బగుచున్నది. ఏమంటివా? నేను బుట్టి బుద్ధియెఱిఁగినది మొదలిప్పటికి మాత్రము ధైర్యముగా నాతో మాటలాడినవానిఁ జూడలేదు. అంగులకే నిన్నింతవఱకు పేక్షించితిని. ఇఁక నుపేక్షింపను.

భీము—ఓరీ! మూర్ఖాగ్రేసరుఁడా! ఈప్రగల్భముల కేమిగాని నే నొక్కటి చెప్పెద నాలింపుము.

ఉ. నీవలెనే పొగర్మిగిలి నిక్కి ననున్ జెనకంగ వచ్చె నాఁ
డావనిలో హిడింబుఁ డనునామిషఖాది, త్రుటిన్ వధించి దు
ర్భావుని వాని నయ్యమపురంబున కంపితి వానికన్ననున్
జేవగలాఁడవే? యతనిచెల్లెలి నేనియుఁ బోలనేర్తువే.

(అంత హిడింబ ప్రవేశించును)

హిడిం—(నమస్కరించి) ఆర్యపుత్రా! జయము, జయము. ఇతఁడు మీ రంత చులుకనగాఁ జూడఁదగినవాఁడు కాఁడు. మాయన్నయు, నితఁడును, వీనితమ్ముండు గిమ్మీరుండును, జరాసంధుఁడును, గీచకుఁడును, దుర్యోధన దుశ్శాసనాదులును, నించుమించుగ సమానులు, కాని యిందులో నొక్కఁడెవ్వరిచే మృతినొందునో

తక్కినవారందఱును నాయనచేతనే చత్తురని వినియుంటిని. కావున మీ కితఁడు సుకరముగనే జయింపఁదగినవాఁడు కావచ్చును.

బకు — ఓసీ ! పరమదుర్మార్గురాలా ! కామమోహితవై యన్నుం జంపించి యీ నగాధముం గట్టికొని యంతం బోక వీనికి సంతతిం గూడఁ గని రాక్షసకులమున కపకీర్తి తెచ్చితివే ? ఛీ ! నీ మొగము చూడఁగూడదు దూరముగాఁ బొమ్ము. నీవు చూచుచుండఁగనే నీమగనిం జంపుదును. చూడుము. (భీమునివంకఁ దిరిగి) ఓరీ ! నరపశువా ! హిడింబుం జంపితినని గర్వించుచుంటివిరా ? అది నీ ప్రయోజకత్వముగాదు విధము.

తే. గీ. తనదు చెల్లెలు నిన్నుఁ గోరినకతమున, దాని మేల్మిక్కిలిగ నెదఁదలఁచు కతన
నిన్నుఁ జంపఁగ లేఁడాయె నీచ? లేక, యున్న నీవేడ? మా హిడింబన్నయేడ?

భీము — (తనలో) ఓహో ! సమయమునకు నాప్రియురాలు కూడ నాకు సహాయురాలుగ వచ్చినదే ! (స్మృతినభినయించి) అవును నాఁడు "వన్నెప్పుడు మీరు దలఁచిన నప్పుడే వత్తు" ననికదా? చెప్పినది. ఈమె యిట్టినెవలిక నేకపర్యాయములువచ్చి యుపకారము చేసెను. (ప్రకాశముగా) దేవీ ! నీవు కడు సత్యసంధురాలవు. నీవొనరించిన యుపకారమును మాతల్లి తఱుమగఁ దలంచుచునే యుండును. నేనిద్దురాత్ముం వధియించుదనుక నీవిక్కడనే యుండి చూచుచుండుము.

బకు — (నవ్వి) ఓరీ ! మానవాధమా ! ఎట్టి చూచుటయే కాగురా ! నీవంటియసమర్థుఁడగు నరాధముఁడను గాకపోఁ బట్టిగాని లేనిచో నియ్యాది వధియింపనే గలదురా

ఉ. ఎందఱిఁ జంపె నీయతివ, యెందఱిరక్తము గ్రోలె మున్ను, దా
నెందఱికొవ్వు మ్రింగె మఱి యెందఱిమాంసము లాహరించె నేఁ
డందఱు మాదృశుల్ శిరము లక్కట ! యొక్కట వంచుకోఁగ ని
న్నుం దగు లొంది యన్యాయమునున్ జెడఁగొట్టెను దానునున్ జెడెన్.

(హిడింబదిక్కు) ఓసీ! తెలిపితక్కువదానా ! జరిగినదేమో జరిగినది యిప్పుడేని నామాటవిని బుద్ధి తెచ్చుకొని వీనిం జంపి నీయన్నకు వచ్చిన యపకీర్తిను బోఁగొట్టుకొనుము. నీకు వచ్చినభయము లేదు. నేను పైనుండి చూచుచుండెదను.

శా. వీనిం జంపిన "భర్తయొవ్వఁ" డనుచున్ వీక్షింపఁగాఁ బోకు మీ
వీ నీచుణ్ వరియించుటే మొదటితప్పి పాటికేనిన్ మృతుం
గా నంకింపమి గొప్పతప్పిటు మొదల్ గావింపు మాపైని నే
నే నిన్నున్ వరియింతు దానవకులం బేలింతు నీచేతనే.

భీము—(కోపముతో నొకచేత దవుడలును నొకచేతఁ గంఠమును నొక్కి) ఓరీ! వాచాటా? ఏమని ప్రేలితివి? ఇదిగోఁ జచ్చితివిరా. (గెంటుకొనిపోవును)

(తెరలో)

బకు—ఓరీ! నరాధమా! ఈగుద్దు కాచుకొనుము.

హిడిం—అక్కటా! నాథుని కెంతగుద్దు తగిలినది! (చూచి) అయ్యో! మూర్ఛిల్లిన ట్లున్నదే! (పరికించి) తేను లేచి యేమో అనుచున్నాఁడు. (తనలో)

తే. గీ. నీకును హిడింబునకుఁ గలనేర్పు తార, తమ్యముఁ జూడఁగా మదిఁదలఁచి యొక్క గుద్దు నవకాశమిచ్చితిఁ గూర? నీచ? యింకఁజూడుము నీబ్రదుకేమియగునొ?

హిడిం—మరల బకుఁ డేమో యనుచున్నాఁడు. (తెరలో)

ఓరీ! వాచాటా! వృథాగర్వాటోపా! క్రిందఁబడ్డను మీఁదివాఁడ నే యనుచుంటివిగా? ఇదిగో, ఈసారి యీకాలితాఁకుతోఁ గూలెదవులే.

హిడిం—(సంతోషముతో) బలే! నాథా! మంచిపని చేయుచున్నావు. అట్లనే రెండు కాళ్ళును బట్టుకొని త్రిప్పుచుఁ దీసికొని పోయి యాసాలవృక్ష స్కంధమునఁ బెట్టి తల పగులం గొట్టుదువుగాక. (తెరలో)

ఉ. కివ్వన నేకచక్రపురి కేరి ముదంబుధి మున్గుఁగాక దా
దవ్వుల నున్న నీభటులు దైన్యము గొందురు గాక మీఁద నిం
కెవ్వఁడు నీకలెం జగము నేర్చక పోయెడుఁగాక యేడ్తెఁ
ద్రివ్విన తాటిపండువలె నీతల త్రెళ్ళెడుఁ గాక గుద్దుఁ.

హిడిం—(సంతోషముతో) ఔరా! మహాత్మా! నన్నవరానిమాట లనినందులకుం దగిన ఫలము నందితివి. ఇఁక నెంతసేపు భూమిపయిం బడి గింజుకొనెదవు. ఈపాటికిఁ జావుము. (తనలో) జయలక్ష్మీపరివృతుఁ డగునాథుని నికటమ్మునకుఁ జని స్వయంగ్రాహాలింగనమ్మున సమ్మానించెదంగాక. (నిష్క్రమించును.)

గద్య

ఇదిశ్రీ...తిరుపతివేంకటేశ్వర ప్రణీతం

బగు పాండవప్రవాసమ్మునఁ

ద్వితీయాంకము.



# పాండవప్రవాసము.

---

## తృతీయాంకము.

(అంత భటుఁడు ప్రవేశించును.)

భటు—(తనలో) నాకుఁ బ్రభువుగా రాజ్ఞయిచ్చిన చొప్పున నాసనములన్నియుఁ దారతమ్య వివక్షగా నలవరించితిని. మత్స్యయంత్రమిదివఱకే సంసిద్ధమై యున్నది. రాజకుమారు లందఱును వచ్చెడివేళ కావచ్చినది. కావున ద్వారముగాఁ బోయి యీయుదంతమును మహారాజుగారికి మనవిచేసిన వారే వచ్చి వీరల గౌరవింతురు. (నిష్క్రమించును.) (ఇది ప్రవేశకము)

(అంత ద్రుపదుఁడు పురోహితునితోఁ బ్రవేశించును.)

ద్రుప—గురువరా! ధ్రువముగాఁ బాండవులు కుశలముగా నున్నారనియే కదా? మీరు సెలవిచ్చితిరి.

పురో—ఆ? ఇంకను సంశయము గూడనా? నేను జ్యోతిషముచేఁ జూచుటయే కాదుకీపదపఁ గొందఱివలనఁ గూడ నీసంగతిని వింటిని.

ద్రుప—ఏమని వింటిరి?

పురో—వినుటకేమున్నది? విదురుఁడు దుర్యోధనుని దురభిప్రాయ మెఱిఁగి రహస్యముగా నొక ఖనకునిబంపి యాలాక్షాగృహమ్మునఁ బాండవులకుఁదక్క నితరులకెఱుఁగరాకుండ నొక పెద్దబిలము త్రవ్వింపఁజేసె ననియు భీముఁడు పురంజనుఁడింక నెప్పుడో నిప్పంటింప వలెనని యనుకొనుచుండ ముందుగానే వానికిఁ దెలియకుండఁ దా నగ్గిదగిల్చి సోదరులను దల్లిని దీసికొని యాబిలముత్రోవను వెలువడి రనియుఁ బురంజనుండును మఱియొక నిషాదవనితయును దానికొమరు లేగురును నందుంబడి చచ్చిరనియు వింటిని.

ద్రుప—కపటియగు పురంజనుని మాటకేమిగాని నిరపరాధులగు నిషాదులు చచ్చుట కడు శోచనీయము.

పురో—అదియును విచార్యముగాదు. ఆనిషాది పాండవుల గుట్టును బురంజనునికిఁ దెల్పుచుఁ బుష్కలాదు లర్పించు మిషచేఁ గుంతీదేవి యొద్దకు వచ్చుచుఁ బోవు

మండెడి దుర్మార్గురాలు. నాఁటిరాత్రి మద్యపానవశమ్మున నాయింటి పంచం బడి నుతసహితిముగా నిద్రించుటం జేసి న్మాతిఁసెందె.

దుర్య—అట్లయిన నిదియును నిట్లు కాఁదగినదే ! మహాత్మా ! ఇంతవిస్పష్టముగాఁ మీఁకీ యుదంత మెట్లు తెలిసినది ?

పురో—అఖిలము త్రివ్విన ఖనికునిభార్య పుట్టినిల్లును నా పెద్దకుమారుని యత్తవారియూరును నొకటే. గోటగుటచేఁ గ్రమముగ స్త్రీలవలన నియ్యది తెలిసినది. దానికి దథ్యముగాఁ బ్రశ్నశాస్త్రముగూడ వారందఱు సుఖులైయున్నట్లు సూచించినది

దుర్య—పాపము ! ధృతరాష్ట్రుఁడు వీరలకుఁ గ్రమముగాఁ బారలౌకికక్రియలు గూడ నెఱవేర్చినాఁడఁట నుఁడీ.

పురో—అవునఁట ఆయనకేమి తెలియును ? విదురుఁ డెఱిఁగియును జెప్పుటకు నలనుపడమి నూరకొనియుండును. (యోజించి) పోనిండు దీనివలనఁ బాండవులకుఁ బీడాపరిహారము కావచ్చును.

దుర్య—ఇంతకును నాదుర్యోధనుని యయోగ్యత కారణము. ఇప్పటికి వృద్ధరాజుమాత్రము తమ్ముని కొమరులయందుఁ దన కొమరులకన్నను నెక్కుడుదయ గలిగి యున్నాఁడనియే చెప్పికొందురు.

పురో—అదియును మనము నమ్మఁదగినది కాదు. (విని) అదుగో రాజకుమారాగమన సూచకమగు మంగళధ్వనులు వినవచ్చుచున్నవి. మనము వారల నెదుర్కొనవలయును. (పరిక్రమింతురు.)

(అంత దుర్యోధన దుశ్శాసనకర్ణులును గృష్ణబలరాములును బ్రవేశింతురు.)

పురో—అయ్యా ! దయచేసి యీ యాసనముల నధిష్ఠింపుఁడు.

(అందఱును యథోచితంబుగాఁ గూర్చుందురు)

దుర్య—(దృష్టినిగిడ్చి) గురువర్యా ? అదుగో ! మఱికొందఱు రాజపుత్రులు వచ్చుచున్నారు. వారలనందఱిని యథోచితపీఠమ్ముల నలంకరింపఁజేయుఁడు.

పురో— అట్లనే యొనర్చెదను. (నిష్క్రమించును)

దుర్య—(మఱియొక దిక్కు చూచి) ఎవరురా ? అక్కడ.

భటు—(ప్రవేశించి) జయము జయము. ఆజ్ఞాపింపుఁడు.

దుర్య—బ్రాహ్మణప్రవరు లనేకు లీయుత్సవముఁ జూడ నేతెంచుచున్నారు. వారలనందఱి నుచితరీతి గౌరవించుటకునై మన ధృష్టద్యుమ్నునితో మాయాజ్ఞఁదెల్పుము.

భటు—చిత్తము (నిష్క్రమించును.) (ధృష్టద్యుమ్నుఁడు ప్రవేశించును.)

ధృష్ట—తండ్రీ! ఎల్లరును యథోచితస్థానములం గూరుచుండిరి, పురోహితులగ్నిని వేల్చుచున్నారు. ద్రౌపదియును సఖీసమేతయై యిటవచ్చియున్నయది. ఇఁకఁ గర్తవ్యము వీరలతో నివేదించెదను.

ద్రుప.—ఆలస్యమెందులకు? నివేదింపుము.

ధృష్ట—ఓధానుష్కశేఖరులారా!

ఉ. ఆమె మదీయసోదరి సమగ్రగుణాకర సర్వలక్షణ
శ్రీమహనీయ యాధనువు చేకొని యేడ్తెఱ మత్స్యయంత్రమిం
దేమహితుండు గా నఱుకు నేనుశరమ్ముల నాతని న్ఘన
ప్రేమమునన్వరించు, వివరించితి నున్నయథార్థమంతయున్.

తే.గీ. కన్యకాలాభ మొక్కండె కాదునుండు, ఎక్కుడు యశంబుగల్గు మీకింతవలన
నాధనువు మాకు నొక్కమహాత్మకతన, దొరకె నది యెక్కువెట్టుటే దుర్లభంబు.

దుర్యో—(అపవారించి కర్ణునితో) సఖా దానిని నీవెక్కువెట్టి యాసుందరాంగిని వరింపుము.

కర్ణు—(అనాకర్ణితముగా) చెలికాఁడా! అటు చూచితివా?

క. కని కొందఱు దరిదరిగాఁ, జనికొందఱు ముట్టికొని వెస న్గొందఱునుఱ్
గొనముబిగలాగి కొందఱు, వెనుకకుఁ జనుచున్నవారు పృథ్వీశసుతుల్.

దుర్యో—మిత్రమా! వీరలవలన నేమగును?

క. ఆలలన యాతలోదరి, యాలలితవిలాస యామహాభాగ్యశ్రీ
లీలావతార చెలి నీ, పాలగు నిక్కముగ నెఱుఁగఁబడియెన్నాకున్

దుశ్శా—అన్నా! నీవనినట్లె కాని యాశిశుపాలుని సంరంభము చూడుము.

బల—(కోపముతో తనలో)

క. ఓశౌరిమూర్ఖ! నీదో,ర్సారము నీవెఱుఁగలేక చాపమ్మునఁ గేల్
పూరించితి వేమాయె, న్నారిన్దగిలింపలేమి నాకెఱుక సుమీ?

కృష్ణ—అన్నా! మినపగింజంత మిగిలి పోయెను గాని లేనిచో నితఁడు కృతకృత్యుఁడే యగును జుమీ!

బల—తమ్ముఁడా! ఒకవేళ వీఁ డెక్కువెట్టునే యనుకొందము; అంతతో నేమగును?

కం. అంబరమునందుఁ గలమత్స్యంబున్ దెగనఱుక వలయు నయ్యది సామా
న్యంబే? యిల్లలికినమా, త్రం బందునయగునె? యదియుఁ దగమే? తఃకుఱ్

కృష్ణ—! అదిగో జరాసంధుఁడు తనయావచ్ఛక్తియు వినియోగించు చున్నాఁడు (పెదవివిఱిచి) పాపము! ఇతనికిని యీమాత్రము కడమ యైనది.

దుర్యో—సఖా! ఎందులకీయాలస్యము? నీకుఁదక్క నొండొరుల కయ్యది సాధ్యము కాదు.

కర్ణ—అదిగో శల్యుఁడు రంగస్థలమున కవతరించుచున్నాఁడు

దుర్యో—ఎవ రవతరించినను నొకటే మన మెఱుఁగని శల్యుఁడా? యేమి.

కర్ణ—ఓహో! ఇతఁడును దుద కొక పెసరగింజంతలోఁ దేలిపోయినాఁడు (తనలో) నాకును నిట్టి పరాభవస్థానమే యగునా? కాదు (పరికించి) యాదవులెవ్వరును నా వంకకే రాక యున్నారు కారణమేమొ? కృష్ణబలరాములే మిన్నకున్నప్పుడు మనకు సాధ్యమగునా? యని సంశయించిరి కాఁబోలును, ఇంతియకాదు కృష్ణుఁడు వారల కిందులకో? యిందుక సంజ్ఞకూడ చేసినట్లున్నది, (యోజించి) కృష్ణుఁడూరకొనుటకు హేతువేమో? (బింకముగా) ఇది కృష్ణునకును గిష్ణునకును సాధ్యమయ్యెడిది కాదు (నడుముగట్టుకొని నిష్క్రమించును.)

దుర్యో—(సంతోషముతో) సఖా! ఇఁక దిలప్రమాణము మాత్రమే కొదవ, పట్టువదలకుము.

ధృష్ట—(ఆత్రముతో) ఔరా! తుద కీ సూతసుతునికి నాచెల్లెలి నీవలసి రాదు గదా! (సంతోషముతో) ఆ! ఇక్కడికీయిక్కట్టు దప్పినది, వీఁడును విముఖుఁడైనాఁడు.

బల—తమ్ముఁడా! నీవూరకొంటివేమి?

తే.గీ. మత్స్యయంత్రముఁ దెగఁగొట్టి మద్రరాజ, కన్యకను లక్షణను లోకమాన్యచరితఁ
గైకొనినయట్టి నీకులక్ష్యంబె? యిదియు, నెందులకుమిన్నకుంటివో యెఱుఁగఁజెపుమ?

కృష్ణ—(రహస్యముగా)

కం. కనుఁగొంటివె? యావిప్రుల, ననఘుల నవ్వారియంద యైదుగురును బాం
డునృపాత్మజు లున్నా రర్జునుఁ డీయంత్రమ్ము నేయు సుదతి వరించున్.

(అంతబ్రాహ్మణవేషముతో నర్జునుఁడు ప్రవేశించును!)

(అందఱును నొకరిమొగము లొకరు చూచుకొందురు.)

బల—(సంతోషముతో) పాండవు లింకను కుశలముగా నున్నారా? (చూచివిచారముతో)

కం. ధృతరాష్ట్రకొడుకులు దుష్కృతులఁ ప్రయోగించినట్టి మాయలకున్ ద
ప్పితిరే? యక్కట! యాక్రియ, క్షితినుగ వేషములు విధి లిఖించెనె? మీకున్.

అర్జు—(తనలో) పూజ్యులగు కృష్ణబలరాములెట్లు చూచుచున్నారో? వీరుగుర్తించినట్లు

న్నది, (నలుదెసలగనుఁగొని) ఇంకఁ నెవ్వరును నన్ను గుర్తించినట్లులేదు (ధనువున్నచోటికిఁ జనును)

ద్రుప—(పరికించి)

చ. వెడఁద యురమ్ము, మూఁపు లవి వీనుల కంటుచునున్న వద్దిరే?
పిడికెఁడు కాను. నేత్రములు పెద్దవి, తక్కినలక్షణంబులుం
గడురమణీయముల్ ద్విజుఁడనం దరమే? యితనిం జగమ్ములో
క్కఁడయయి యేలఁగాఁ దగఁడె? కట్టెఁడి నాఁ జనదే? విధాతృనిన్
కాన యితని నేనెప్పుడో యొకపరి చూచినట్లున్నాఁడను.

ధృష్ట—(ఆశ్చర్యముతో).

తే.గీ. వేదపాఠుం డితం డేడఁ బెద్దపెద్ద, చతురులఁ బరాభవించునీచాప మేడ
నంచుననుకొంటి నితఁడదియశ్రమమున, నెక్కువెట్టెనునిఁకయంత్ర మేయుచున్న

దుర్యో—(ఆశ్చర్యముతో) ఏమీ యీబ్రాహ్మణవటుని చాతుర్యము

కం. చిరపరిచిత మగుచాపము, కరణిన్ శ్రమమింతలేక కైకొని గొనమున్
సరిచేసి కూర్చి యంత్రము, నఱుకుచునున్నాఁడు వాఁడి నారాచములన్.

దుశ్శా—(ఆశ్చర్యముతో) అన్నా!

తే.గీ. సూతపుత్రునియంతటిశూరవరుని, కలవిగానట్టి యీకృత్య మలఁతిగా స
మర్థమొనర్చెనీవిప్రుఁడహహా! యెవఁడో, యెవరిశిష్యుఁడో? తలిదండ్రులెవ్వరొక్కొ,

దుర్యో— దీని కింతవిచార మేల? బ్రాహ్మణులలో మాత్రము శూరాగ్రేసరులు లేరా?

తే.గీ. పరశురాముని లోకైకగురుని వినమె? యతనిశిష్యుండెకద ! తాత యఖిలజేత
ఇంతయెందుకు ? మనగురు వెవ్వ రమ్మ, వాత్మకొమరుఁడశ్వత్థామకన్న వీఁడె!

ద్రుప—(చూచి) యంత్రము నఱికి యీవిప్రార్భకుండు చాపధారియై యిక్కడికే వచ్చుచున్నాఁడు. (అర్జునుఁడు ప్రవేశించును.)

ద్రౌప—(ప్రవేశించి సిగ్గుతోఁ బుష్పమాల యతని కంఠమున వైచిచనును.)

ద్రుప—(విచారముతో)

క. పాండవమధ్యమునకు నా, ఖండలతనుజాతునకును గన్నియనిడఁగా,
గొండాడితుఁ దకఁ గార్ముక, పండితునకు నీయవలసె బ్రాహ్మణున కయో!

అయినను నీవిషయ మింకను బరిశీలింపవలసియున్నది, కాని పరిశీలించి చేయవలసినదిలేశము గానరాదు.

దుశ్శా—(జనాంతికముగా) అన్నా! చూచితివా? యీరాజు మనకందఱికిని నెట్టియ వమాన మొనర్చెనో? కావున నితని కిప్పట్టునఁ దగినశాస్తి యొనరింప వలెను.

దుర్యో—అవును; అట్లవశ్యము జరుఁగఁదగినదే? (ప్రకాశముగా) ఓయీ! పాంచాల భూపాల?

ఉ. ఇచ్చితి కూతు, "యంత్రమును నేసె" నటంచొక పాఱువానికిం
బొచ్చెముచేసి, శూరులగు భూవరు లూరక పోవ నేర్తురే?
వచ్చినత్రోవవెంబడిని, వహ్వారె! క్రొవ్వునఁ దెచ్చుకొంటి వీ
ముచ్చట, నీకు నిక్కతన ముప్పు ఘటింపకమాన దెమ్మెయిన్.

కర్ణ—(ప్రవేశించి)

కం. అవిప్రవటునిలోపం. బా వంతయు లేదు మాకు నవమానంబు
న్నీవొనరించితి, వీందుల, కేవగ నుత్తరము చెప్పి దేర్పఁడవలయున్.

ధృష్ట—ఓయి: సూతపుత్రా! నేనొక్కటి చెప్పెద వినుము.

ఉ. కట్టినమత్స్యయంత్రమును గాఁడఁగ నేసినవానికే కదా!
పట్టినొసంగు నీనృపుఁడు, పార్థివు లేమిటి కల్గఁగానలెన్?
దిట్టతనంబు గెల్గుటకుఁ దెల్వియుఁ దేటయుఁ గల్గియుక్తికిం
బట్టగు పట్టునవ్వలయుఁ బట్టును బంతము శూరభావమున్.

తే. గీ. ఊరకేగ్రుద్దు లాడుట యుక్తిగాదు, పార్థివులకిచ్చెద మటంచుఁ బల్కినామె
ఇంత రోఁదుకు? యంత్ర మీ వేసితేని, నీకె యీయమె రాజవా? నీవుచెపుము?

కర్ణ—(తనలో) అక్కటా! వీఁడు నన్నుమఱియు నవమానించినాఁడే.

కృష్ణ—చిన్నవాఁడైనను మంచి యుక్తిగాఁ జెప్పినాఁడు

ఉ. విద్దియ చూచి యివ్వనిత పెండిలి యాడెదఁగాని "యన్వయం
బెద్ద" యటన్నయంశ మిట నేర్పడ లేదొకయించుకైన, లెం
డద్దముగట్టినట్లు కననౌవిషయంబున లేనిపోనియీ
సుద్దులు పెద్దలౌనృపులు చూచిన నవ్వుదు రింతయేటికిన్.

దుర్యో—(గర్వముతో) వాసుదేవా? యేమినీవిట్లు చెప్పుచున్నావు?

తే. గీ. కార్ముకపుఁగృత్య మిర్యోడఁ గలదుగాన, నదియు రాజులకే విధియగును గాన
రాజులే యర్హులనెడి యర్థమ్ము వచ్చు, యోగ్యతను జూడకుండుట యుక్తమగునె?

దుశ్శా— సంశయమేమి?

ఉ. పాఱుఁడు యంత్రమేసె నని పట్టి నొసంగుట ధర్మమా? యెం
పారెడి యగ్రహారములా ? యంతకునున్ బయిపెమ్మభూములా?
చీరలా మాడలా ? ధనమొ ? సేలువులా? యొసఁగంగరాదె? యే
ధారుణిఁ గల్గు? నిట్టిపని, తప్పపను ల్సహియింపు టొప్పునే?

బల—(కొంచెము కోపముతో) దుశ్శాసనా! నీవు చిన్నవాఁడవు, ఇందు వివాద్యాంశము లేశమును లేదు. ఊరకొనుము.

క. ఎందఱు రాజులు విప్రుల, కెందఱుఁ గన్నియలనీయ? రిదియొకతప్పా ?
తందరపడు టుచితంబే, గందరగోళంబు మానికదలుఁడు నృపతుల్.

కర్ణ—(తనలో) ఈద్రుపదుని నిష్పట్టున నెల్లని యవమానించి తీరవలయును. ఇందుల కుపాయ మేమో ? (యోజించి) ఇట్లగుగాక (ప్రకాశము) బ్రాహ్మణులకుఁ జాతుర్వర్ణ్యవివాహ ముండుటచే నితఁ డీయనిచ్చును నతండు పరిగ్రహింపను వచ్చును, గాని యింకొక విశేషము మాత్రమున్నది. బ్రాహ్మణుఁడు క్రమముగా నాలుగుజాతుల కన్నియలను బెండ్లి యాడవచ్చునుగాని మొట్టమొదటనే క్షత్రియకన్యకం గొనదగదు, అట్టివాని కితఁడు వర్ణాశ్రమ ధర్మములను జక్కఁగాఁ బాలింపఁదగురాజయ్యును నెట్టులిచ్చుచున్నాఁడు? కావున నవశ్యమును నితఁడు దండ్యుఁడ యగులంజేసి మేమితనిని విడువము.

భీమ—(బ్రాహ్మణవేషముతోఁ బ్రవేశించి కోపముతో) విడువరేమి? విడువక చేసెడిదేమో? చేయుఁడు— (తెరలో)

శూరాగ్రేసరులగు నో బ్రాహ్మణవటువులారా! మీరు వెనుదీయవలదు మీతోపాటు మేము సంసిద్ధులమైయున్నారము. మీకువచ్చిన భయములేదు.

క. శపియింతుము మంత్రమ్ములు, జపియింతుము వలసెనేని జంపన్ జాలన్
గృపణులము కాము నిక్కము. దపమంతయు ధారపోయఁదలచితి మిందున్.

ఓరీ! వేరిశాస్త్రీ? నీవు పోయి పరశురాముని బిల్చుకొనిరా. ఔరా? పాపాసధానీ! నీవరిగి మనద్రోణాచార్యులను గృపాచార్యులను అశ్వత్థామను దీసికొనిరమ్ము. ఈరాజు లేమిచేసెదరో చూడవలెను.

అర్జు—(చేయెత్తి) ఓతపోధనులగుబ్రాహ్మణాగ్రేసరులారా ? మీరేమియుఁ జేయునక్కఱ లేదు. మిన్నక చూచుచుండుఁడు.

దుర్యో—(నవ్వుచు) తమ్ముఁడా? యీవిప్రులెల్లనంగవస్త్రమ్ములు జారీకొమ్ముల కెట్లు ముడివైచి నిలుచు[illegible]రో? చూడుము.

కర్ణు—కార్ముకవిద్యానిపుణుండ వగుదో విప్రనందనా? నేనొక్కటి చెప్పెద నాలింపుము.

ఉ. పుట్టిననాఁట నుండియును భూసురకోటికిఁ గేలు మోడ్చి నె
ప్పట్టున వారితోడను వివాద మొనర్చుట కిచ్చగింప నీ
కట్టులనేనిఁ జేపడియె నీనృపుకన్నియ. దానికేమి? మా
పట్టినపట్టు మిమ్ములను బట్టదు పార్థుడు రూపుమాపెడున్.

కం. శూరులగురాజవరులకుఁ, బాలురతోఁ గలహ మన్నఁ బక పక నగరే?
ధారుణిప్రజ లెల్లరుమీ, రీ రమణిం దీసికొంచు నేగఁగ నమ్మున్.

ద్రుప—(తనలో) ఓహో! యీసూతాధముఁడు వృథాగాఁ గలహముం బెంచుచున్నాఁడు. వీనింబట్టి దుర్యోధనాదులును వారింబట్టి తక్కిన రాజమండలమును దిగకమానదు.

ధృష్ట—(ఏకసక్కెముగా) ఓయీ? సూతపుత్రా? ఉత్తమక్షత్రియునకుఁ బ్రాహ్మణులతో యుద్ధము తగకుండు నేమో? కాని సామాన్య నృపతులకును నీవంటిసూతవంశజులకును నిట్టి విచార ముండదు. కదా!

ఉ. మంచియుఁ జెడ్డయున్ దెలియుమానిసి "కియ్యది యుక్తమిద్దిగా"
దంచు విచారణంబు, దురహంకృతిశాలికి మంచిచెడ్డ లెం
చెంచఁగనున్నవే? యిటులనేని వృథాకలహమ్ము పెంచి తా
వంచనసేయఁబూని యట వంచన గాంచుటయే స్వభావమా.

భీము—(ఏకసక్కెముగా) ఓయీసూతాధమా!

తే. గీ. పూని నీచేత సజ్యంబుగానిధనువు, లీలఁ గొనియంత్రమేసె నిబ్బాలకుండు
"ఇతనితోఁ బోరలే" వని యెవ్వ రెఱుఁగ. రేగు మూరక నవ్వెద రెల్లవారు.

అర్జు—నీవు బ్రాహ్మణులతోఁ బోరవేమోకాని మేము క్షత్రియులతోఁగాని తదన్యులతోఁ గాని పోరుట కభ్యంతరములేదు.

ఉ. ఎంతటిజ్ఞానశూన్యుడవొ యిట్టి కుయుక్తులు పన్నుచుంటివా
యింతినిఁ గొన్నవానిపయి నెవ్వనికేనియుఁ గోపముండు నా
యింతిని గన్నవానిపయి నేటికిఁ? గోప మొకింత చెప్పుమీ
వంతముగల్గెనేని ననుఁ బట్టుము కొట్టుము నెట్టుమీసతిన్.

ఆ. వె. ఇంత తెలివితక్కు వెందు నేఁ గనలేదు, ద్రుపదుఁ డెవరు? నాకు నృపునినొకని
నింతమందిమీగ లేకమై వధియించ, నూరకేను జూచుచుండవలెనె?

ద్రుప—(తనలో) ఇతని ధైర్యస్థైర్యాదికము చూచిన బొత్తిగా బ్రాహ్మణుఁడని తేశమును గానరాకున్నది. (యోజించి) ఏమో! అట్లనుకొనుటయు వలనుపడదు; పరశురాముఁడు లేఁడా? ద్రోణాదులు లేరా?

కర్ణు—(ఏకపక్కముగా) నా తెలివితక్కువను జూతువు గాని రంగమున కవతరింపుము. ముందు నీక్రొవ్వడఁగించియే పిదప జామాతృబాహుబలావలంబనోద్భూత గర్వాస్పదుండగు నీద్రుపదునియు భగినీపతి పరిరక్షితపరాక్రమజనితదుర్గర్వవిమ్మండగు ధృష్టద్యుమ్నునియుఁ బొగ్గణగించెద. (కర్ణార్జునులు నిష్క్రమింతురు.)

భీమ—(దుర్యోధనుని దిక్కై యొక్క పక్కముగా) అదిగో పాపము! మీతమ్ములందఱును మా బ్రాహ్మణుని ధాటికి నోడి పాఱుచున్నారు. మీరు చూచి యూరకొనుచున్నారేమి ?

దుర్యో, దుశ్శా—(తమలో) ఏమి యీపాఱుని పొగరు? (చూచి) ఇదిగో మేము వచ్చుచున్నాము. నిలువుడు. నిలువుడు. (నిష్క్రమింతురు)

భీమ—(చూచి తనలో) తమ్ముఁడును కర్ణుఁడును దుల్యముగాఁ బోరాడుచున్నారు. కృపాశ్వత్థామలూరక చూచుచున్నారు. కర్ణుండు కొంచెము తీసిపోవుచున్నాఁడు, పోకేమి ? మన మెఱుఁగని కర్ణుఁడా? (ఆశ్చర్యముతో) ఔరా! వీరియవివేకము, ఇప్పటికేని తమ్మునింగుఱితింప లేరు. (కోపముతో) లక్కయింటఁ జచ్చితిమనియే కాబోలును వీరలదృఢనిశ్చయము. అదిగో దుర్యోధనాదులు గూడఁ గర్ణునికి బాసటయై తమ్మునిపైకి బఱుకుచున్నారు కానిమ్ము వీరలపొగరు నేనణంచవలెను (నిష్క్రమించును)

ద్రుప—కుమారా! చూచితివా? రణ మెట్లుప్రవర్తిల్లుచున్నదో. వీరలెవరో బ్రాహ్మణవేషము ధరించిన హరిహరులవలె నున్నారు. (మఱియొక దిక్కు చూచి) అదిగో బ్రాహ్మణులందఱును నొకపెట్టునఁ గురుబలముపైకి నుఱుకుచున్నారు. మనము వీరికిఁ దోడుగానుండి కాపాడుదము పద. (కుమారునితో నిష్క్రమింతురు.)

బల—తమ్ముఁడా! యుద్ధమెంతభరముగా నున్నదో చూచితివా? భీమార్జునులే కనుపట్టుచున్నారు. కాని ధర్మరాజును గవలును నాకా బ్రాహ్మణసంఘములో నానవాలుగాఁ దెలియకున్నారు.

కృష్ణ—ఉ. తాళమునంటివిల్గొనివధన్యుఁడు క్రీడి యనోకహంబుదాఁ
గేల ధరించి మార్తురను గీటడఁగించెడువాఁడు భీముఁడి
య్యాలము రాకమున్న శమనాత్మజుఁడున్ గవలున్ సమేతులై
యేలొకొ యేగి రక్కతన నియ్యెడ వారలు లేరు సోదరా !

బల—(చూచి) కురుబలమెల్లఁ బటాపంచలై యెట్లుపరుగిడుచున్నదో! (కోపముతో)
ఓరీ ! మూర్ఖుడా ; దుర్యోధనా !

చ. గద భుజమందు వైచికొని కయ్యమునుండి తొలంగి పాఱి పో
యెదవె? మదీయశిష్య నిను నెల్లరు నవ్వఁగ నాఁడు దుర్యశం
బెదిగి శిరంబు నెత్తుకొన నిచ్చునె? నేటికి నిన్నుఁ జేరి యా
గదయును నాగురుత్వమును గంగకు నర్పితమయ్యె నేమిరా?

కృష్ణ — అదుగో నర్జునుఁడు జయలక్ష్మీలాలితుఁడై పాంచాలిని వెంటఁబెట్టుకొని పోవుచున్నాఁడు,

బల — మన మిక్కడ నిఁక నెందులకు?

కృష్ణ — అదుగో ధృష్టద్యుమ్నుఁడిటు వచ్చుచున్నాఁడు. అతనితోఁ జెప్పి యొకసారి కుంతీదేవిం జూడఁబోవుదము.

ధృష్ట — (ప్రవేశించి తనలో) తండ్రిగారు "మునుకన్నియంగొన్న బ్రాహ్మణు లేరో సంజనియెడఁబో పరిశీలింపు" మనియెను. అట్లొనర్చెద (పరికించి) అదుగో అవీధింబడి చనుచున్నారు.

కృష్ణ — పాంచాలకుమారా! మే మరుగుచున్నాము. (నిష్క్రమింతురు.)

ధృష్ట — (కొంతదూరము నడచి) అదిగో అకుంభకార గృహమునకుఁ బోవుచున్నారు. అక్కడనే పొంచి వీర లేమి మాట్లాడికొందురో వినియెద (అట్లొనరించి విని) ఈసంగతులన్నియుఁ బోయి తండ్రిగారికి విన్నవించెదను. (పరిక్రమించి) అదుగో తండ్రిగారు పురోహితులతో నీవిషయమునే కాఁబోలును ముచ్చటించుచున్నారు.

(ద్రుపదుఁడును బురోహితుఁడును బ్రవేశింతురు.)

ద్రుప — గురువరా? మీరు స్వయంవర మేర్పఱచినఁ దప్పక యర్జునుండు వచ్చునని సెలవిచ్చితిరి కదా! అట్లు జరిగినదా?

పురో — ఇంకను సందియ మేమి?

ఆ. వె. అర్జునునికిఁదక్క నామత్స్యయంత్రమ్ము, నితరుఁ డేయఁజాలు డేటిమాట?
కర్ణునంతవాఁడు గజగజలాడెన, వ్రింట గుణము గూర్చ వెరవులేక.

ఇది యిట్లుంచుము.

చ. ఎగిరినవారి నెల్ల మద మేదఁగఁ జేసి యొకింతలోన న
మ్మదపతిఁగొంచుఁ బోవుటకు మాదృశవిప్రులకానె? లేశమున్
మదిఁ గదియింపఁబోకు మనుమానముఁ బ్రాహ్మణులేడ? పౌరుషా
స్పదులగు నేడ యింతపని సల్పునె? పార్థుఁడు గాక యుండినన్.

ధృష్ట—తండ్రీ ! నీయాజ్ఞచొప్పున వలసినంతవఱకుఁ దెలిసికొని వచ్చితిని వారుమన యాజ్ఞ సేనిం దీసికొని యొక్క కుంభకారగృహమ్మున కరిగిరి. అచ్చటికే కృష్ణ బలరాములుగూడ వచ్చిరి. అయ్యెడ నిఁక నొకముప్పురు పురుషులును నొకముసలియాపె యును గలరు.

పురో—రాజా! చూచితివా? ఆమె కుంతి వారు ముప్పురును ధర్మజనకులసహదేవులుఁ; భీమార్జునులను రణరంగమునఁ జూచితిమికదా.

ద్రుప—కుమారా ! యింతవఱకేనా? నీయెఱిఁగినది.

ధృష్ట—ఇంతేకాదు. కృష్ణబలరాములును వారును మాటలాడికొనినరీతిం బట్టి చూడఁద ప్పక వారు పాండవులే యని నిశ్చయించితిని.

ద్రుప—అట్లయిన నీవు పోయి యారాదంత మంతఃపురమునకుం జెప్పుము.

ధృష్ట—చిత్తము (నిష్క్రమించును)

పురో—యిక్కడికి నీసందియము తీఱినదా?

ద్రుప—తీఱకేమి ? తీఱినది. అయినను మీరేగి వారియాథార్థ్య మింకను దఱిచి తెలిసి కొని యిక్కడికిం గొనిరండు.

పురో—(పోయి పాండవులతోడను గుంతీద్రౌపదులతోడను బ్రవేశించి.)

వీరు కుంతీమహాదేవులు, వారు పాండవులుఁ.

ద్రుప—(వినయముతో) అక్కా; భోజపుత్రి!

ఉ. పావన మర్త్యలోకులము ఫల్గునుఁడల్లుఁడు కావుటన్, మహీ
దేవులుకారు మీరనుచుఁ దెల్ల మెఱింగితి నింతచేసిరే ?
కావలులైన కౌరవులుఁ, కష్టములెల్ల భరించి నేఁటికిన్
దేవునను గ్రహమ్మున సుదీర్ఘత గాంచితి కల్లభఁగులన్.

ఇఁక నాలస్యమెందులకు ? విజయునిఁ బెండ్లికొమరునిఁ జేసి సలక్షణమ్ముగా వివాహతం త్రము నడపుకొందము.

కుంతి—అన్నా ! పాంచాలభూపాల! అగ్రజులగు ధర్మజభీములుండఁగా) గొండికయ గు ఫల్గునునికిఁ బెండ్లియెట్లు? అదిగాక నావచనంబుకతమున నిక్కన్నియకు వీరేవురు నుబతులు గాని|యొక్కరుండు గాకుండు.

ద్రుప—(తనలో) ఈమెయభిప్రాయమే చక్కఁగా బోధపడినది కాదు. ఒకకన్నియ కైదుగురు పతులెట్లు? (ప్రకాశముగా) ధర్మనందనా!

